# సమస్యలు పోగొట్టే కొన్ని పుణ్యక్షేత్రయాత్రలు

("శ్రీ అష్టలక్ష్మీసిద్ధి గ్రంథం నుంచి)



మొదటి ముద్రణ:

2015

వెల: రూ. 30/-

# విషయసూచిక

## వివాహం ఆలస్యం అవుతున్నవారు దర్శించాల్సిన క్షేత్రం

కళ్యాణసుందర్ ఆలయం. ఈ క్షేత్రం తమిళనాడు రాష్ట్రంలోని తంజావూరు జిల్లాలో కుట్టాలమ్ నుంచి 6 కి.మీ దూరంలో ఉంది. కావేరీ నదీతీర ప్రాంతంలో నిర్మితమైన ఈ ఆలయంలోని మూర్తులు పార్వతీపరమేశ్వరులు. పార్వతీదేవి చేయిపట్టుకుని పాణిగ్రహణం చేస్తున్న పరమేశ్వరుని విగ్రహాన్ని చూడవచ్చు. అనగా ఆదిదంపతలు వివాహం జరిగిన పవిత్రమైన స్థలంగా భక్తులు పూజిస్తారు. కళ్యాణసుందరమూర్తి, కోకిలాంబాళ్‌గా ప్రసిద్ధికెక్కిన ఈ మూర్తులకు మొక్కుకుని వారి కోర్కెల నెరవేరిన తర్వాత పుష్పమాలలతో అలంకరించి పూజించుకుంటారు భక్తులు. నవగ్రహదేవతలలో ఒకరైన రాహువు ఇక్కడ లింగరూపంలో ఉండటం వలన రాహుగ్రహపీడ కలిగినవారిని పూజకు అనుమతిస్తారు.

## చర్మవ్యాధులున్న వారు దర్శించాల్సిన క్షేత్రం

ఒప్పిలయప్పన్ ఆలయం. ఈ క్షేత్రం తమిళనాడు తంజావూరు జిల్లాలోని కుంభకోణానికి 5 కి.మీ దూరంలో ఉన్నది. 108 వైష్ణవ దివ్యక్షేత్రాలలో ఈ క్షేత్రం ఒకటి. మార్కండేయ క్షేత్రమని ప్రసిద్ధికెక్కినది. ఇచ్చట ఉన్న భూమిదేవి మార్కండేయునికితులసివనంలో కనిపించినందు వలన ఈ క్షేత్రాన్ని తులసివనం అని కూడా అంటారు. భూమిదేవి లేకుండా ఇక్కడి స్వామివారి ఉత్సవ విగ్రహాన్ని బైటకు కదిలించరు. ఈ క్షేత్రంలో ఉన్న అహోరాత్ర పుష్కరిణిలో రాత్రి, పగలు అని తేడా లేకుండా స్నానం చేయవచ్చు. ఉప్పు, మిరియాలతో కూడిన మిశ్రమాన్ని ఇక్కడ ఉన్న గరుడస్వామికి నివేదిస్తారు భక్తులు. ఇలా చేయటం వల్ల చర్మసంబంధమైన వ్యాధులు నయమవుతాయని భక్తుల విశ్వాసం.

# శత్రునాశనం కొరకు, భార్యా వియోగం తొలగుటకు

# కొరకు దర్శించాల్సి క్షేత్రం

శ్రీఆది కుంభేశ్వరాలయం. ఈ ఆలయం తమిళనాడు కుంభకోణంలోని ప్రధాన ఆలయం. అతిప్రాచీనమైన ఈ ఆలయం కావేరీనది అరసలార్ నదుల మధ్యలో ఉంది. శైవులు దర్శించవలసిన దేవాలయాలలో ముఖ్యమైనది. స్వామివారు కుంభేశ్వరలింగం, అమ్మవారు మంగళాంబికాదేవి. 51 శక్తి పీఠాలలో ఒకటిగా భక్తులు నమ్ముతారు.

శివలింగం పైభాగం కొద్దిగా వంగి ఉన్న కారణంగా కుంభకోణం అనే పేరు వచ్చింది. (కుంభం అంటే కుండ, కోణం అంటే వంపు.) గరుత్మంతుడు అమృతభాండమును తీసుకుని వెళుతుండగా ఈ ప్రాంతంలో ఒక అమృతపు చుక్క జారి పడిపోతుంటే శివుడే స్వయంగా ఇక్కడి ఇసుకతో ఒక కుండను తయారుచేసి అందులో ఆ జారే అమృతబిందువు పడే విధంగా చేసి అందులో స్వయంభులింగంగా ఉండిపోయాడు. ఆ కుండ చేసినపుడు పైభాగం కొద్దిగా

వంగినట్టుగా వచ్చిన కారణంగా కుంభకోణం అని పేరు వచ్చింది.

రావణుడు సీతాపహరణం చేసిన తర్వాత శ్రీరాముడు సతీవియోగ దుఃఖంతో ఇక్కడికి వచ్చి స్వామిని ఆరాధించి వెళ్ళి తన శత్రువైన రావణసంహారాన్ని చేసాడని పురాణసారాంశం. గంధద్రవ్యాలలేపనం తప్ప ఇక్కడ స్వామికి నిత్యాభిషేకాలు జరగవని చెబుతారు.

## భార్యభర్తల అన్యోన్యత కోసం దర్శించాల్సిన క్షేత్రం

జంబుకేశ్వర ఆలయం. ఇది తమిళనాడు రాష్ట్రం చెన్నై నుంచి 330 కి.మీ దూరంలో ఉన్న తిరుచిరాపల్లికి 5 కి.మీ దూరంలో తిరువేనక్కావల్ అనే ఊరిలో ఉంది. సృష్టిలో పరమేశ్వరుడు పంచభూతములు అనబడే ధాతువుల రూపం ధరించి పలుచోట్ల స్వయంభువుగా వెలిశాడు. అందులోని రెండవదైన జలరూపం ధరించి వెలసిన క్షేత్రం ఈ జంబుకేశ్వరాలయం. పార్వతీదేవి ఒకానొకసమయంలో పరమేశ్వరుడిని ఎగతాళి మాట

అనటంతో స్వామి మనసు కష్టించినది. దాంతో శివుడు పార్వతీదేవిని కైలాసం వదిలి భూలోకం వెళ్ళి ఉండమని ఆజాపించగా ఆమె కావేరీ నది ఒడ్డున వున్న ఈ జంబూకద్వీపంలో నివాసం ఏర్పరుచుకుని నదినీటితో ఒక లింగరూపం తయారు చేసి ఆ లింగాన్ని ఒక చెట్టుక్రింద ప్రతిష్ఠించి తపోదీక్షను చేపట్టింది. ఆ తర్వాత ఒకనాడు కావేరీ జలాన్ని చేతిలోకి తీసుకోగానే జలలింగంగా రూపుదాల్చింది. వెంటనే శివునిలో శక్తి ఐక్యమైంది. అన్యోన్యత కరువైన దంపతులు గానీ, వారి తరుపున ఎవరైనా గానీ ఈ క్షేత్రంలోని స్వామివారిని పూజిస్తే ఫలితం త్వరితంగా చేకూరుతుంది.

## విద్యా సిరిసంపదలు కొరకు దర్శించాల్సిన దివ్యక్షేత్రం

శ్రీలక్ష్మీహయగ్రీవ స్వామి ఆలయం. చెన్నై నుండి నైఋతి వైపున రామ్‌నగర్ ప్రాంతానికి సమీపంలో నంగనల్లూరులో ఉన్నది. ఇక్కడి స్వామి రూపం శ్రీమహావిష్ణువు అవతారాలలో ఒకటిగా ప్రసిద్ధి గాంచింది. ఈ స్వామి నాసిక నుండి

వెలువడుతున్న ఉచ్ఛ్వాస, నిశ్వాసముల నుండే వేదాలు పుట్టినట్లు శ్రీభాగవత కథ తెలియచెప్తోంది. లక్ష్మీసమేతుడైన హయగ్రీవస్వామిని పూజిస్తే విద్యా సంపదలతో పాటు సిరిసంపదలు కూడా సొంతం చేసుకోవచ్చని భక్తుల అపార విశ్వాసం. శ్రావణమాసంలో శ్రావణ నక్షత్రం రోజున హయగ్రీవ జయంతి ఘనంగా జరుగుతుంది. విద్యారంభానికి ఈ రోజు అత్యంత శుభదినమని చెప్తారు.

## తెలిసీ తెలియక చేసిన దోషాలు పోవటానికి దర్శించాల్సిన క్షేత్రం

విష్ణుకంచి లోని శ్రీవరదరాజస్వామి దేవాలయం. తమిళనాడులోని కాంచీపురం జిల్లా ప్రాంతంలోని 'కరగిరి'లో ఉన్నది. 108 వైష్ణవ దివ్యక్షేత్రాల్లో ఒకటి. ఈ ఆలయంలో గర్భాలయానికి ఈశాన్యం వైపున ఉన్న మండపం పైకప్పుకి రెండు బంగారు, వెండి బల్లులు కలవు. వీటిని ముట్టుకుంటే జీవితంలో బల్లి వంటి మీదపడ్డా ఎటువంటి దోషం ఉండదు. అర్థశాస్త్ర సృష్టికర్త కౌటిల్యుడు జన్మస్థలం.

వెయ్యి స్తంభాల మండపం ఉన్న ఈ దేవాలయంలో లోని వరదరాజస్వామిని కృతయుగంలో బ్రహ్మదేవుడు, త్రేతాయుగంలో గజేంద్రుడు, ద్వాపరయుగంలో బృహస్పతి, కలియుగంలో అనంతశేషుడు పూజించారని చెబుతారు. ఈ స్వామిని పూజించిన తెలిసీ తెలయక చేసిన దోషాలు పోతాయని భక్తులు నమ్మకం.

## దీర్ఘ రోగాలు నయం కావటానికి దర్శించాల్సిన క్షేత్రం

శ్రీ మరుందీశ్వర స్వామి ఆలయం. ఈ ఆలయం తమిళనాడు చెన్నై నుంచి కన్యాకుమారి వెళ్ళే రహదారిలో తిరువాన్మయూర్‌లో ఉన్నది. ఎంతో పురాతన ఆలయం. ఎత్తయిన పానవట్టంపై కొలువుతీరి భక్తుల పూజలను అందుకుంటున్నారు ఇక్కడి మరుందీశ్వరస్వామి వారు. వాల్మీకి మహర్షి స్వయంగా శివలింగాన్ని ప్రతిష్టించి పూజించారు. అందుకనే ఈ క్షేత్రానికి 'తిరువాల్మీకి ఊరు' అని నామం కూడా ఉన్నది. వాల్మీకి మహర్షి పూజలకు

మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమవగా స్వామిని ఇక్కడే లింగరూపంలో ఉండాలని కోరగా స్వామి లింగరూపంలో ఈ క్షేత్రంలోనే ఉండిపోయారు. ఈ స్వామిని దర్శిస్తే ఎంతటి దీర్ఘ రోగాలైనా తగ్గిపోతాయని భక్తుల నమ్మకం.

## మహాపచార దోషాలు పోవటానికి దర్శించాల్సిన క్షేత్రం

అంకోల గణపతి ఆలయం. ఇది తమిళనాడులోని చెన్నై జిల్లాలోని పొన్నేరికి మూడు కి.మీ దూరంలో ఉంది. వేదకాలంలో ప్రతిష్ఠాపితమైన ఈ ఆలయం చతుర్వేదపురముగా ప్రసిద్ధికాంచినది. స్వామి చతుర్వేదేశ్వరుడు. శివుని ఆజ్ఞమేరకు అగస్త్యమహాముని 108 రోజులు 108 సైకత శివలింగాలను ప్రతిష్ఠించగా చివరిరోజున లింగాలు అన్నీ ఏకమై 'గణపతి' రూపాన్ని ధరించాయి.

ఆశ్చర్యపోయిన అగస్త్యునకు మహేశ్వరుడు కన్పించి 'మహర్షీ! నీవు పూజ ప్రారంభించే ముందు గణపతిని ప్రార్థించనందున స్వామికి ఆగ్రహం కలిగినందున ఇలా జరిగింది. కానీ ఈ గణపతి భక్తుల

కోర్కెలను తీరుస్తూ కలియుగాంతం వరకూ నిలిచి ఉంటాడు' అని అనుగ్రహించాడు. దాంతో నెమ్మదించిన మహర్షి తెలసి చేసినా, తెలియక చేసినా తప్పు తప్పే కనుక చతుర్వేదేశ్వరస్వామి లింగానికి తోడుగా మరొక లింగాన్ని ప్రతిష్టించి ప్రాయశ్చిత్తం చేసుకున్నాడు. నూట ఎనిమిది సైకత లింగాను అర్చించిన తర్వాత ప్రతిష్ఠించడం వల్ల ఆ లింగానికి శ్రీనూత్రేశ్వర స్వామి అన్న పేరు స్థిరపడింది. కావున తెలిసీ తెలియక చేసిన తప్పులు తొలగటానికి ఇక్కడి స్వామిని పూజించి వడమాలను అర్పిస్తే తప్పక ఫలితం ఉంటుందని భక్తుల నమ్మకం.

## అనంత విద్యాప్రాప్తి కొరకు దర్శించాల్సిన క్షేత్రం

శ్రీ మధుర మీనాక్షి ఆలయం. తమిళనాడు లోని మధురైలో ఈ ఆలయం ఉంది. 6వ శతాబ్దంలో పాండ్య రాజు కులశేఖరుడు ఆలయాన్ని నిర్మించాడు. భక్తులను ఆశీర్వదించటానికి వచ్చిన పరమేశ్వరుని నుంచి జారిపడిన ఒక తేనె చుక్క వల్ల ఈ నగరానికి మధుర అనే పేరు వచ్చినదనేది స్థలపురాణం. తమిళపురాణం ప్రకారం శివునికి, మీనాక్షిదేవికి ఇక్కడే

వివాహం జరిగిందని తెలుస్తోంది. సంగీతం, భరతనాట్యం మొదలగు కళలకు ఇక్కడ వెయ్యి స్థంభాలతో కట్టిన మండపం వేదిక అని చెబుతారు. ఇక్కడ స్వామి సుందరేశ్వరుడు, అమ్మ మీనాక్షీదేవి. వీరిని దర్శించుకుని ~~ఈ~~ ఆలయంలో ఉన్న పద్మ సరోవరంలోని నీరు స్వీకరిస్తే సరస్వతీదేవి కటాక్షం తప్పక లభిస్తుందని భక్తుల నమ్మకం.

## జన్మ చరితార్థం చేసుకోవటానికి, పితృదేవతల తృప్తి కోసం దర్శించాల్సిన క్షేత్రం

శ్రీరామనాథస్వామి ఆలయం. తమిళనాడులోని రామనాథపురం జిల్లాలో రామేశ్వరం ఉంది. ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటి. చతుర్ధామాల్లోని మొదటి ధామం కూడా. రెండవ ధామం ద్వారక, మూడవది పూరిజగన్నాథ్, నాల్గవది బదరీనాథ్ ధామం. హిందూ పురాణాల ప్రకారం శ్రీరాముడు సేతువును .... అనగా రామసేతుని ఇక్కడే నిర్మించాడని తెలుస్తోంది. రావణసంహారానంతరం శ్రీరాముడు బ్రాహ్మణహత్యాపాతకాన్ని పోగొట్టుకోవటానికి

రామనాథేశ్వరస్వామిని ఇక్కడ ప్రతిష్ఠించాడని చెబుతారు. సముద్రస్నానానంతరం ఇక్కడ ఉన్న ఇరవైరెండు బావుల్లో తప్పకుండా స్నానం చేస్తేనే ఫలితం దక్కుతుందని చెబుతారు. ఇక్కడకి వెళ్ళాలని మనస్సులో అనుకుంటే తప్పకుండా వెళ్ళి తీరాలి. కాశీక్షేత్రాన్ని దర్శించి అక్కడి గంగాజలాన్ని తీసుకువచ్చి రామేశ్వరంలోని శ్రీరామలింగేశ్వరునికి అర్పించితే జన్మసాఫల్యం అవుతుందని నమ్మకం.

## సంతానం లేని దంపతులూ, నవగ్రహ దోషాలు పోవాలనుకునే వారూ దర్శించాల్సిన క్షేత్రం

ధనుష్కోటి ఆలయం. తమిళనాడులోని రామేశ్వరం నుండి 35 కి.మీ దూరంలో ఉన్నది. బంగాళాఖాతము, హిందూ మహా సముద్రముల సంగమ స్థలం. రామేశ్వరంలో పూజ చేసి ధనుష్కోటి వద్ద ఈ సముద్రాల సంగమంలో స్నానం చేయనిదే యాత్ర సఫలం కాదని చెబుతారు. ఇక్కడి నుండే రామసేతు వంతెను ప్రారంభమై లంకకు కలిసేలా రూపొందించబడింది. రావణవధ అనంతరం

వానరసేన సేతువును పగలగొట్టినట్లు చెబుతారు. శ్రీరాముడు కూడా తన ధనస్సుతో వంతెనను కొట్టాడనీ అందుకే ధనుష్కోటి అని పేరు వచ్చిందని చెబుతారు. కాకపోతే ఈ క్షేత్రం దాదాపుగా సముద్రంలో మునిగిపోవటం చేత ఇక్కడ తొమ్మిది రాతిబండలు వరుసగా మిగిలి ఉన్నాయి. వాటిని నవగ్రహాలుగా భావించి పూజిస్తే మనోదోషనివారణ ప్రాయశ్చితం జరుగుతుందని బృహస్పతి ఉవాచ. అందువలననే సందర్శకులు ఇక్కడ సముద్రస్నానం చేసి నవగ్రహాలని పూజించి పాపాల్ని తొలగించుకుంటారు.

## స్త్రీ కన్నీటికి కారణమైన వారు దర్శించాల్సిన క్షేత్రం

స్థానేశ్వరస్వామి వారి ఆలయం. తమిళనాడులో కన్యాకుమారి నుండి 13 కి.మీ దూరంలో శుచీంద్రంలో ఉన్నది. ఈ క్షేత్రంలో బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరులు ఏకమూర్తిగా వెలసి ఉన్నారు. కన్యాకుమారిని వివాహం చేసుకోవాల్సిన శివుడు ఇక్కడ స్థానేశ్వరుడై వెలసి బ్రహ్మచర్యాన్ని పాటిస్తున్నాడు. పురుషులకు ధోవతి లేదా లుంగీతో మాత్రము ప్రవేశం ఉంటుంది. స్త్రీలు

సాంప్రదాయ దుస్తుల్ని ధరించాలి. ఒక స్త్రీ కన్నీటికి కారణమై గౌతమ మహర్షిచే శాపగ్రస్థుడైన ఇంద్రుడు నిత్యం అర్ధరాత్రి సమయంలో సలసల కాగే నేతి ధారలలో నడిచి వచ్చి ప్రభాత సమయం వరకు త్రిమూర్తులను సేవించి శుచియుయ్యాడు. తత్కారణంగానే ఈ క్షేత్రానికి శుచీంద్రమని పేరు వచ్చింది.

## నాగదోషాలు పోవటానికి దర్శించాల్సిన క్షేత్రం, ఇసుక ప్రసాదంగా లభించే క్షేత్రం

నాగరాజమందిరం. ఇది తమిళనాడు కన్యాకుమారి నుండి నాగర్ కోయిల్ పట్టణంలో ఉన్నది. ఇక్కడి నాగరాజు మందిరం అతి పురాతనమైనది. చోళులు ఈ ఆలయాన్ని నిర్మింపచేసినా ఆలయం గోడలపై జైన తీర్థంకరులు, మహావీర, పార్శ్వనాథ చిత్రాలు కనిపిస్తాయి. గర్భాలయంలోని స్వామి విగ్రహం ప్రక్కనే ఒక చిన్ని నీటి ఊట ఉంటుంది. ఆ నీటిని తీర్థంగా, అక్కడ ఇసుకని ప్రసాదంగా అర్చకుడు ఇవ్వటం ఇక్కడి విశేషం. అయితే ఆ ఇసుక మొదటి ఆరు నెలలు

తెల్లగానూ, తర్వాత ఆరునెలలు నల్లగా ఉంటుందని చెబుతారు. ఆ ఆలయం నుంచి 2 కి.మీ పరిసర ప్రాంతంలో ఎక్కడా కూడా పాముకాటుకు విషం ఎక్కదని వరం ఉందని తెలుస్తోంది.

## దర్శించి మొక్కుకుంటే ఎంతటి రోగాలనైనా నివృత్తి చేసే క్షేత్రం

వైదీశ్వరన్ కోయిల్. ఆలయం పేరే ఊరి పేరు కూడా. తమిళనాడులోని చెన్నై నుండి మైలాడుతురై వైపు వెళ్ళే మార్గంలో ఈ ఆలయం ఉన్నది. అతి పురాతనమైన, పవిత్రమైన ఆలయం. ఒక మహర్షి తనకి పెద్ద జబ్బు చేయటంతో పరమేశ్వరుని గూర్చి భక్తితో తపస్సు చేయగా పరమేశ్వరుడే స్వయంగా వచ్చి ఆయన జబ్బు నయం చేశాడని స్థల పురాణం. ఈ ప్రాంతంలోని వారు ఎవరైనా సరే ఎటువంటి జబ్బు వచ్చినా ఇక్కడకి వచ్చి మొక్కుకుంటారు. స్వామి వారు వైదీశ్వరన్, అమ్మవారు బాలాంబల్. అద్భుతమైన శిల్ప సౌందర్యంతో నిర్మితమైన ఈ ఆలయంలోని స్వామివారిని సేవిస్తే అమితజ్ఞానం స్వంతమవు తుందని కూడా చెబుతారు. నవగ్రహమూర్తులైన

బుధుడు, కేతువులకు ఇక్కడ విడివిడిగా ఆలయాలు ఉండటం విశేషం.

## గాలి, ధూళి, భూత సంకటాలను వదిలించే క్షేత్రం

వేదనాయక ఆలయం. తమిళనాడులో నాగపట్నం జిల్లా వేదారణ్యంలో ఉన్నది. రావణుని సంహార సమయంలో ఎందరో రాక్షసవీరులు శ్రీరాముడి చేతిలో హతులయ్యారు. వారంతా కూడా పెనుభూతాలై శ్రీరాముడిని వెంటాడుతుండగా వారిని వదిలించుకోవటానికి స్వామి మొదట వినాయకుడ్ని ప్రార్థించి వాటిని శాంతింపచేసి ఆ ఆత్మలకు శాంతిని చేకూర్చటానికి ప్రక్కనున్న గ్రామంలో శివలింగమును ప్రతిష్ఠించి నాడని పురాణువాచ. వినాయకుడు వడక్కం వినాయకుడిగా గాళి, ధూళి, భూతములను వదిలించే స్వామిగా ప్రసిద్ధి గాంచాడు. ఈ స్వామిని పూజించటానికి వేదాలు ముఖద్వారాన్ని తీసుకుని స్వయంగా వచ్చి పూజించి వచ్చినదారిని గట్టిగా బంధించివేసి వెళ్ళిపోవటం కారణంగా వినాయకుడ్ని దర్శించుకోవటానికి ప్రక్కద్వారము నుండి వచ్చి స్వామిని దర్శించుకోవాలి. ఇంకా ఇక్కడ స్వామి

చండికేశ్వర స్వామి, అమ్మవారు చండికేశ్వరి. పార్వతీదేవి సరస్వతీదేవిని వీణావాద్యంలో ఓడించి వెలసిన అమ్మవారిగా ఈ దేవిని కొలవటం ఇక్కడి ప్రత్యేకత.

## మానసిక సమస్యలు గలవారు దర్శించాల్సిన క్షేత్రం

శ్రీ కుర్తాళేశ్వర దేవాలయం. తమిళనాడు తిరునల్వేరి జిల్లాలో కుర్తాళం ఉన్నది. ఈ ఆలయంలోని స్వామి కుర్తాళేశ్వరుడు, అమ్మవారు విరేణు నరవాణి. ఆలయం కొద్ది దూరంలో పారుతున్న చిత్రవతీ నదీ జలపాతం నీటిలో ఉండే వనమూలికలు కారణంగా మానసిక వికలాంగులు స్నానం చేస్తే వారికి స్వస్థత చేకూరుతుందని భక్తుల నమ్మకం. ఈ నదికి కొద్ది దూరంలో వినాయకుడి ఆలయం వుంది. ఆ ఆలయంలోని స్వామి పేరు నాడిగణపతి. ఈ విగ్రహానికి మనుషులవలే నాడి కొట్టుకుంటుంది. కొంతమంది వైద్యులు స్టెతస్కోపుతో పరిశీలించి స్వామివారి తొడల నుండి శబ్దం వస్తుందని తెలిపారు. అందువలన స్వామి వారి విగ్రహానికి తొడలు కనిపించకుండా ధోవతిని కడతారు.

# అతిపెద్ద నందిగల క్షేత్రం

చిదంబరం. తమిళనాడు కడలూర్ జిల్లాలో ఉన్నది. చెన్నై నుండి సుమారు 243 కి.మీ దూరంలో ఉంటుంది. ఆలయ నడిబొడ్డులో నటరాజస్వామి ఆలయం ఉంటుంది. శివుడు శివతాండవం చేస్తూ నటరాజుగా వెలసిన ఆలయం. మానవరూపంలో శివుడు ఉండే ఏకైక ఆలయం. పంచభూతాల కొరకు నిర్మించిన ఆలయాల్లో ఈ ఆలయం ఆకాశతత్వానికి నిర్మించబడినది.

ఇంకా కంచి ఏకాంబరేశ్వర ఆలయం భూమితత్వానికీ, తిరువణ్ణామలై అరుణాచలేశ్వర ఆలయం అగ్నితత్వానికీ, శ్రీ కాళహస్తీశ్వరస్వామి ఆలయం వాయుతత్వానికీ మరియు జంబుకేశ్వర ఆలయం జలతత్వానికి నిర్మింపబడ్డాయి.

నటరాజస్వామి ఆలయంలో శ్రీనందీశ్వరుని విగ్రహం భారతదేశంలోని నందులలోకెల్లా పెద్దదైందిగా ఉండి సజీవత్వం ఉట్టిపడుతుంటుంది. ఇక్కడ కోనేరు శివగంగను సువర్ణకోనేరు అని పిలుస్తారు. ఇది ఆలయంలోని వేయి స్తంభముల మండపానికి పడమట వైపున ఉన్నది.

## కార్తీకమాసంలో తప్పక దర్శించాల్సిన క్షేత్రం

అరుణాచల దేవాలయం. ఇది తమిళనాడులోని తిరువణ్ణామలై జిల్లాలో ఉన్నది. అన్నామలైయర్ అనబడే ఈ దేవాలయం అత్యంతప్రసిద్ధమైనది. పంచభూత క్షేత్రాలలో అగ్నిని సూచించే ఈ ఆలయంలోని స్వామి అరుణాచలేశ్వరునికి తేజోలింగమని కూడా పేరు ఉంది. అమ్మవారు అరుణాచలేశ్వరి. పూర్వం బ్రహ్మ, విష్ణువులు తమ ఇద్దరిలో ఎవరు గొప్ప అనే విషయం తేల్చుకోదల్చి గొడవపడుతున్నప్పుడు వారిమధ్య ఒక పెద్ద అగ్నిలింగం ఉద్భవించిందట. ఇంకా ఆకాశవాణి నుంచి వారిని గొడవపడవద్దని వాక్కు వినవచ్చింది. వారు గొడవ ఆపి తమ మధ్య ఉద్భవించిన అగ్నిలింగం ఆది, అంత్యాలు తెలుసుకోదల్చి బ్రహ్మదేవుడు హంసరూపంలో పైపైపుకి, విష్ణుమూర్తి వరాహరూపంలో క్రిందికి బయలుదేరారు. ఎంతదూరం వెళ్ళినా వారికి ఆద్యంతాలు కనపడకపోవుటతో తిరిగి వచ్చిన వారి ముందు పరమేశ్వరుడు ప్రత్యక్షమై వారి కోరికపై వారి

అజ్ఞానాన్ని మన్నించి ఒక కొండ రూపంలో వెలిశాడు. ఆ కొండే అరుణాచలం. కార్తీకమాసంలో వైభవంగా ఉత్సవాలు జరుగుతాయి. కార్తీకపౌర్ణమి నాడు కార్తీకదీపోత్సవం విశిష్ఠంగా జరపబడుతుంది. కార్తీకమాసంలో తప్పక దర్శించవల్సిన క్షేత్రం.

## సౌభాగ్యసిద్ధి కోసం దర్శించాల్సిన క్షేత్రం

శ్రీమహాలక్ష్మి ఆండాళ్ దేవాలయం. తమిళనాడులో విరూధ్‌నగర్‌జిల్లాలో శ్రీవిల్లిపుత్తూర్ లోని ఆలయం. 108 వైష్ణవ దివ్యక్షేత్రాల్లో ఒకటైన ఈ దేవాలయంలోని అమ్మవారు గోదాదేవి, అయ్యవారు వటపత్రసాయి. అత్యంత పురాతనమైన దేవాలయం. వివాహం కానివారు ఇక్కడి అమ్మవారిని దర్శించుకుని ధనుర్మాస వ్రతాన్ని ఆచరిస్తే వివాహయోగం కలిగి సౌభాగ్యసిద్ధి తప్పక కలుగుతుందని భక్తుల విశ్వాసం. విష్ణుచిత్తుడనే శ్రీహరి భక్తునకు తులసీవనంలో ఓ ఆడశిశువు దొరికింది. శ్రీమన్నారాయణుని కటాక్షంగా భావించి ఆమెకు గోదాదేవి అని నామము పెట్టి అల్లారు

ముద్దుగా పెంచుకున్న ఆమె శ్రీరంగనాథుడ్ని నిరంతరం సేవించేది. ఆయనే ప్రత్యక్షదైవమని భావించేది. రోజుకొక పాశురంతో స్వామిని కీర్తిస్తూ ధనుర్మాస వ్రతాన్ని ఆచరించేది. ఆ పాశురాలే తిరుప్పావై ప్రబంధంగా ప్రసిద్ధి చెంది ఆమెను ఆండాళ్‌గా భక్తులు కీర్తించారు. ఆ స్వామి భక్తిలోనే మునిగి స్వామిని వివాహమాడి శ్రీరంగనాథునిలో ఐక్యం అయ్యింది గోదాదేవి.

## లక్ష్మీప్రాప్తి కొరకు దర్శించాల్సిన పుణ్యక్షేత్రం

శ్రీనారాయణి పీఠం. తమిళనాడులోని వెల్లూరుకు 6 కి.మీ దూరంలో ఉన్న శ్రీనారాయణి పీఠంలో శ్రీలక్ష్మి అమ్మవారు గ్రామదేవతగా వేంచేసి ఉన్నారు. గ్రామదేవత అయిన అమ్మకి బంగారంతో తాపడం చేసిన గుడి ఉంది. ఇలా గ్రామదేవతకి బంగారుగుడి దేశంలో మరెక్కడ కనిపించదు. స్థలపురాణం ప్రకారం ఒక చెట్టుకింద గ్రామదేవతగా పూజలందుకుంటున్న శ్రీలక్ష్మి అమ్మవారికి ఎక్కడినుంచో వచ్చిన ఒక పన్నెండు సంవత్సరాల

బాలుడు నిత్యం పూజలు చేస్తూ ఉండేవాడు. ఆ బాలుడి అనన్యమైన భక్తిని చూస్తున్న వారు క్రమంగా అక్కడికి వస్తూ ఉండేవారు. ఆ బాలుడు ఎవరైనా అడిగితే వారికి జోస్యాన్ని చెప్పేవాడు. అమ్మవారి సన్నిధిలో ఉంటూ ఒక విధమైన శక్తి కలిగి ఉండటం చేత ఆ బాలుడి మాటలు నిజమవటంతో జనం పోటెత్తసాగారు. ఆ బాలుడు తాను ఆ అమ్మవారి అంశతోనే జన్మించానని చెప్పేవాడు. ఆ బాలుడే ఇప్పుడు నారాయణి అమ్మగా పిలవబడుతున్నాడు.

**ద్వాపర యుగం నాటి విగ్రహాలను కలిగిన క్షేత్రం....**

ఉడిపి. కర్ణాటక రాష్ట్రంలోని మంగళూరు నుండి 87 కి.మీ దూరంలో ఈ పుణ్యక్షేత్రం ఉంది. 'ఉడుప' అనే మాట నుంచి 'ఉడిపి' అని ఈ నగరానికి పేరు వచ్చింది. ఉడిపి ఆలయంలోని స్వామి బాలకృష్ణుడి చేతిలో ఒక త్రాడు, మరొక చేతిలో కవ్వముతో దివ్యాభరణములతో భక్తులకు దర్శనమిస్తాడు. ఈ విగ్రహం ద్వాపరయుగం నాటిది.

పూర్వం దక్షప్రజాపతి శాపాన్ని పొందిన చంద్రుడు ఈ స్థలానికి వచ్చి ఇక్కడ ఉన్న

చంద్రపుష్కరిణి పక్కన చంద్రమౌళీశ్వరుని గూర్చి ఘోర తపస్సు చేసి శాపవిమోచనం చెందాడని స్థలపురాణం. ఇంకా కనకదాసు అనే భక్తుడిని కరుణించుటకు పశ్చిమాభిముఖంగా స్వామి తిరిగి ఉంటాడు. అందువలననే గర్భాలయం నందున్న తూర్పు ద్వారము మూయబడి ఉంటుంది. స్వామి దర్శనం పశ్చిమం వైపు ఉన్న కిటికీ యొక్క 9 రంధ్రముల నుంచి మాత్రమే ఉంటుంది. ఎంతో ముద్దులొలుకుతూ ఉండే ఈ బాలకృష్ణుడి విగ్రహం ఎత్తు రెండున్నర అడుగులు.

## శనిదోషాలను సంపూర్ణంగా తొలగించే క్షేత్రం

పావగడలోని శనైశ్చరాలయం. కర్ణాటక లోని పావగడలో ఈ ఆలయం ఉన్నది. అత్యంత ప్రసిద్ధిచెందిన శనీశ్వర ఆలయం. అతి పెద్దదైన ఈ ఆలయం ఒక ప్రత్యేకత కలిగి అన్ని ఆలయాలకంటే భిన్నంగా ఉంటుంది. ఇక్కడి శనైశ్చరునకి పూజలు నిర్వహించిన వారికి శనిదోషాలు సంపూర్ణంగా తొలుగుతాయని భక్తుల నమ్మకం. శ్రావణమాసంలో ఇక్కడ భక్తులు పోటెత్తుతారు. ఉదయం ఐదు

గంటల నుంచి ప్రత్యేక పూజలు నిర్వహిస్తారు. స్వామి పూజకు కావల్సిన అన్ని వస్తువులు ఇక్కడ లభిస్తాయి. ఇక్కడ పూజలు భక్తుల రుగ్మతలను పోగొట్టి మానసిక ప్రశాంతతను ఇవ్వటమే కాక శనిదోషాలు సంపూర్ణంగా నశింపచేస్తాయి.

## నాగదోషాలను పోగొట్టే క్షేత్రం

విదురాశ్వత్థ క్షేత్రం. కర్నాటక రాష్ట్రంలోని చిక్‌బళాపూర్ జిల్లాలో పినాకినీ నదీ తీరములో ఉన్నది ఈ క్షేత్రం. ఆంధ్రాలో అనంతపురం జిల్లా హిందూపూర్ నుండి సుమారు పదిహేను కి.మీ దూరంలో ఉంటుంది. ఇక్కడి స్వామివారు అశ్వత్థ నారాయణుడు. ద్వాపరయుగంలో విదురుడు తీర్థయాత్రలు చేస్తూ ఈ నదీతీరానికి వచ్చినపుడు ఇక్కడ నివాసితుడైన మైత్రేయ మహర్షి వద్ద శిష్యరికం చేశాడు. వీరిరువురూ శ్రీమహావిష్ణువు గూర్చి పినాకినీ నదిలో తీవ్రమైన తపస్సు ఆచరించుతుండగా ఒక అశ్వత్థ వృక్ష శాఖ నదిలో తేలుతూ వీరి వద్దకు రాగా మహర్షి సూచన మేరకు విదురుడు ఆ కొమ్మను ప్రతిష్ఠించగా అది వృక్షమై విదురాశ్వత్థముగా

పిలవబడింది. ఇప్పటికీ మహావృక్షమై భాసిల్లుతున్న ఆ వృక్షము సమక్షంలోని క్షేత్రమే విదురాశ్వత్థ క్షేత్రం.

ఈ వృక్షం సమీపంలోని పుట్టలోని నాగరాజములను పూజించి ఇక్కడ నాగప్రతిష్ఠ చేస్తే నాగదోషం నివారణమౌతుందని భక్తుల నమ్మకం.

## పాము భయం వున్నవారు దర్శించాల్సిన క్షేత్రం

శ్రీఅనంతపద్మనాభస్వామి ఆలయం. ఈ క్షేత్రం కర్ణాటకలోని మంగుళూరుకు 10 కి.మీ దూరంలో ఉన్న కుడుపు అనే గ్రామంలో వుంది. కుడుపు అనగా తుళు భాషలో పాముతో ఉన్న బుట్ట అని అర్థం. ఆలయంలోని శ్రీ అనంతపద్మనాభుడు పాము ఆకృతిలో ఐదు తలలతో భక్తులకు దర్శనమిస్తాడు. ఇక్కడి స్వామిని దర్శించి పూజిస్తే పాము వల్ల భయం ఉన్నవారికి ఉపశమనం చేకూరుతుంది. ప్రతి సంవత్సరం శ్రావణ మాసంలో ఐదవ రోజు వచ్చే నాగపంచమి పండుగను ఘనంగా జరుపుకుంటారు. కుడుపు గ్రామంలోని మహిళలు ఆవుపేడ, ఆవుపాలు ఉపయోగించి ఇంటి గోడలపై పాముల చిత్రాలు గీస్తారు. ఆ విధంగా చేయటం

వల్ల పాములు వారిని కాటు వేయవని నమ్మకం.

## జీవితంలో ప్రతిఒక్కరు దర్శించాల్సిన మహా క్షేత్రం

శ్రీఅనంతపద్మనాభస్వామి ఆలయం. కేరళ రాష్ట్ర రాజధాని తిరువనంతపురంలో ఈ ఆలయం ఉన్నది. ఇక్కడ శ్రీఅనంతపద్మనాభస్వామి ఆదిశేషుడ్ని పాన్పుగా చేసుకొని తలను దక్షిణ దిక్కుగా పెట్టుకుని ముఖాన్ని తూర్పు ముఖంగా ఉంచి శయనిస్తున్న ముద్రలో భక్తులకు దర్శనమిస్తాడు. శయనాకారంలో దర్శనమిస్తాడు కాబట్టి అనంతశయనుడు అని స్వామికి పేరు వచ్చింది.

అమ్మవారు శ్రీహరిలక్ష్మి తాయారు. స్వామి వారి ముఖం, వక్షస్థలం తప్ప మిగతా మూర్తి మొత్తం బంగారంతో పోతపోయబడి తయారుచేయబడింది. తన నాభియందు బ్రహ్మదేవుడు కొలువుదీరిన పద్మాన్ని కల్గి ఉన్న శ్రీమహావిష్ణువే అనంతపద్మనాభుడు.

అనంతమైన సంపద కలిగి ఉన్న స్వామి. ప్రధానాలయం మలయాళ సాంప్రదాయ పద్ధతిలో నిర్మింపబడి ఉంటుంది. స్వామి వారి విగ్రహం

కటుశర్కర యోగం అనే ఆయుర్వేద ఔషధాల మిశ్రమంతో తయారు చేయబడింది.

నేపాల్‌లోని గండకీ నదీతీరం నుంచి ఏనుగుల సహాయంతో తీసుకొచ్చిన 12000 సాలగ్రామాలతో ఈ విగ్రహం తయారుచేయబడింది. పెద్ద విగ్రహం అవుట చేత ఈ స్వామి మూడు ద్వారాల గుండా దర్శనమిస్తాడు. మొదటి భాగంలో విష్ణువు తలభాగము చేతికిందుగా ఉన్న శివలింగాన్ని చూడవచ్చు.

ఇక రెండవ భాగం గుండా నాభి నుండి వెలువడిన కమలం మీద ఆసీనుడైన బ్రహ్మ, మూడవ ద్వారం నుండి విష్ణుమూర్తి పాదపద్మములు దర్శనమిస్తాయి. అమ్మవార్లు శ్రీదేవి భూదేవులు రెండవ ద్వారం నుండి భక్తులకు దర్శనమిస్తారు. సిరిసంపదలు ఈ స్వామిని దర్శించినంతనే కలుగుతాయని భక్తుల విశ్వాసం.

## 'నారాయణీయం' చదివినా, ఈ క్షేత్రం దర్శించినా వ్యాధులు నయం

గురువాయూర్. కేరళలోని త్రిసూర్ జిల్లా కేంద్రం నుండి 30 కి.మీ దూరంలో ఈ ఆలయం ఉంది.

శ్రీకృష్ణభగవానుడు వెలసిన ఈ క్షేత్రం దక్షిణ ద్వారకగా ప్రసిద్ధి గాంచిన విష్ణు క్షేత్రం కూడా. గర్భాలయంలోని స్వామి వారి మూర్తి ఒకప్పుడు బ్రహ్మదేవుడు తయారుచేసుకుని పూజించిన విగ్రహం.

బ్రహ్మదేవుడు ఆ విగ్రహాన్ని విష్ణుమూర్తికి ఇవ్వగా ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడు తనతో తెచ్చుకుని తన చివరి కాలంలో ఉద్ధవుని చేతికి ఇచ్చి ఆ విగ్రహాన్ని బృహస్పతి, వాయుదేవుల చేత సరయిన స్థలంలో ప్రతిష్ఠింపచేయమని తెలుపగా వారు ఆ విగ్రహాన్ని ఇక్కడ ప్రతిష్ఠించారు. బాలకృష్ణుడు నల్లని రూపంలో ఇక్కడ స్వామి భక్తులకు దర్శనమిస్తారు.

**16**వ శతాబ్దంలో నారాయణభట్టు అనే ఆయనకి ఘోరమైన వ్యాధి వచ్చినపుడు ఆయన గురువాయూర్ వచ్చి స్వామిని దర్శించి నిత్యం ఆ స్వామిపై పది శ్లోకాలను రచించి స్తుతించేవాడంట. అలా ఆయన వెయ్యి శ్లోకాలను పూర్తి చేయగానే వ్యాధి పూర్తిగా తగ్గిపోయిందట. ఆయన రచించిన శ్లోకాలన్నీ కేరళ అంతటా “నారాయణీయం” అనే పేరుతో ప్రాచుర్యం చెందాయి.

# లక్షలమంది దీర్ఘరోగాలను నయం చేసిన మహాక్షేత్రం

ధన్వంతరి ఆలయం. కేరళ రాష్ట్రంలోని యర్నాకుళానికి తూర్పు దిక్కున ఉన్న వడక్కన్‌చెర్రి నుండి 9 కి.మీ దూరంలో ఉన్న నెల్లువాయి అనే గ్రామంలో ఈ ఆలయం ఉన్నది. 3500 సంవత్సరాల క్రితం నిర్మింపబడ్డ అతి పురాతన ఆలయం. వైకుంఠ ఏకాదశి నాడు ప్రత్యేకంగా పసుపు, మిరియాలు, పెరుగు, ఉప్పు కలిపిన మిశ్రమాన్ని ప్రసాదంగా ఇస్తారు. ఇది ఒక ఔషధంగా శరీరంలో పనిచేస్తుందని చెబుతారు. పూర్వము ఇది శివాలయంగా ఈ ఆలయంలో శివునికి మాత్రమే పూజలు జరిగేవి. తర్వాత ఇక్కడ ధన్వంతరి మూర్తిని ప్రతిష్ఠించిన పిమ్మట ఇది ధన్వంతరి ఆలయంగా ప్రసిద్ధి చెందింది. దీర్ఘరోగాలు ఇక్కడ మాయమైపోతుండటంతో లక్షలాదిమంది రోగులు ఈ క్షేత్రదర్శనం చేసుకుని తమ రోగాలను నయం చేసుకుంటున్నారు.

# తల్లి, తండ్రిని బాధపెట్టిన దోషాలు పోవటానికి దర్శించాల్సిన క్షేత్రం

లవకుశపురీశ్వరాలయం. కేరళలో కాలికట్ పట్టణానికి 125 కి.మీ దూరంలో సీతాకుశలవ ఆలయం ఉంది. శ్రీరాముడు సీతాదేవిని అడవికి పంపినపుడు  వాల్మీకి మహర్షి తన ఆశ్రమంలో ఆ మాతకి ఆశ్రయం కల్పించాడు. గర్భవతి అయిన సీతాదేవి ఇద్దరు కుమారులకు జన్మ ఇవ్వగా మహర్షి వారికి కుశ, లవులని నామకరణం చేశాడు. కొంత కాలం తర్వాత శ్రీరాముడు అశ్వమేధయాగం చేసినపుడు యాగాశ్వాన్ని వదలగా దాన్ని కుశలవులు బంధించారు. అశ్వాన్ని విడిపించటానికి వెళ్ళిన అందరూ వారి చేతిలో చిత్తుగా ఓడిపోగా శ్రీరాముడే స్వయంగా యాగాశ్వాన్ని విడిపించటానికి వెళ్ళాడు. వారిని చూచి ముద్దులొలుకుతున్న వారిని ఏమీ చేయలేక అశ్వాన్ని విడవమని ఎంతచెప్పినా విడవకపోవటంతో యుద్ధం చేయసాగాడు. ఆ సమయంలో హనుమ  అక్కడికి వచ్చి కుశలవులతో

శ్రీరాముడు వారి తండ్రి అనీ, తండ్రితో యుద్ధం తప్పు అని చెప్పాడు. యుద్ధం ఆగింది. శ్రీరాముడు వారిని చేరదీశాడు. తండ్రిపైనే యుద్ధానికి దిగినందుకు పశ్చాత్తాపంతో వారు తమ పాపానికి నిష్కృతిగా ఒక శివలింగాన్ని ఆ ప్రదేశంలో స్థాపించి పూజలు చేసి తమ పాపాన్ని నివృత్తి చేసుకున్నారు. కుశలవులు పూజించిన ఆ శివలింగానికి అప్పటినుండి కుశలవపురీశ్వరుడు అని పేరు వచ్చింది. ఆ కారణంగా తల్లి, తండ్రిని బాధపెట్టిన వారు ఇక్కడికి వచ్చి స్వామిని పూజిస్తే వారి పాపాలు తొలగతాయని భక్తుల విశ్వాసం.

## ప్రపంచంలోనే ఉన్న ఏకైక దుర్యోధన ఆలయం

మలనాడలో ఉన్నది. ఇది కేరళ రాష్ట్రంలోని కొల్లం జిల్లా కేంద్రానికి 35 కి.మీ దూరంలో మలనాడులో నిర్మింపబడి ఉన్నది. చిన్నకొండ మీదున్న ఆలయం. దుష్టుడిగా చూడబడే దుర్యోధనునికి కట్టిబడిన ఈ ఆలయంలో తమ ఆవులనీ, పంటపొలాల్నీ కాపాడే దేవునిగా నిత్యపూజలను చేస్తారు భక్తులు. ఆలయంలోని

గర్భగుడిలో నల్లరాతి గద్దె దర్శనమిస్తుంది. ఎటువంటి అర్చామూర్తి ఉండదు. అరణ్యావాసం తర్వాత పాండవులు చేస్తున్న అజ్ఞాతవాసాన్ని భగ్నం చేయటానికి వచ్చిన దుర్యోధనుడు ఈ ప్రాంతంలోనే ఉండి సిద్ధుల సలహా మేరకు ప్రస్తుతం ఆలయ గద్దె ఉన్న ప్రాంతంలోనే శివుని కొరకు ఘోర తపస్సు చేశాడని స్థలపురాణం. అలా ఇక్కడకు వచ్చిన దుర్యోధనుని ఆ ప్రాంత ప్రజలు ఘన స్వాగతం పలుకగా దుర్యోధనుడు సంతసించి ఆ ప్రాంతానికి వారినే పాలకులగా నియమించాడని చెబుతారు. కేరళ భాషలో మల అంటే కొండ, నాడ అంటే ఆలయం. అందుకే ఈ ఆలయం ఉన్న ప్రదేశానికి మలనాడ అని పేరు వచ్చింది.

## గోహత్యా దోషాలను పోగొట్టే క్షేత్రం

గోవర్ధన గిరి. ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని మధుర నుండి 30 కి.మీ దూరంలో ఉన్నది. బ్రహ్మదేవుడికీ, కాళీయుడికి శ్రీకృష్ణుడు ప్రత్యక్షమైన పవిత్రస్థలం. శ్రీకృష్ణుడు భక్తులను కాపాడటానికి తన చిటికెన వ్రేలితో గోవర్ధన పర్వతాన్ని ఎత్తి గిరిధారిగా

స్తుతించబడిన స్థలంగా ప్రసిద్ధి చెందింది. ఈ ప్రాంతంలో ఉన్న మానసగంగ అనే సరస్సులో స్నానం చేస్తే గోహత్యా దోషం పోతుందని భక్తుల విశేష నమ్మకం. 14 మైళ్ళ చుట్టుకొలతతో వుండే ఈ గోవర్ధనగిరి ప్రదక్షిణను భక్తుల అలవోకగా భక్తిపారవశ్యంతో చేస్తారు. ఇక్కడి మానసగంగ సరస్సు చుట్టూ చేసే ప్రదక్షిణ గోవర్ధని గిరి ప్రదక్షిణతో సమానమని చెప్తారు. ఆలయంలో స్వామి గోవర్ధననాథుడు శిల్పరూపంలో దర్శనమిస్తాడు. శిల్పం పైన చెక్కిన నెమలిపింఛము అద్భుతంగా గోచరిస్తుంటుంది. దీపావళీ, శ్రావణ భాద్రపద కార్తీక మాసాలలో అత్యంత వైభవంగా ఉత్సవాలను చేస్తారు.

## భార్యభర్తల నడుమ అన్యోన్యతను పెంచే క్షేత్రం

సీతారాముల ఆలయం. ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని అలహాబాద్ నుండి 125 కి.మీ దూరంలో మందాకినీ నదీ తీరంలోని చిత్రకూటం అనే క్షేత్రంలోని ఆలయం ఇది. మందాకినీ, పయస్వినీ నదుల సంగమస్థలంలో శ్రీసీతారాములు వనవాససయమంలో ఎక్కువ కాలం గడిపారు.

భరద్వాజ ముని సలహా మేరకు మందాకినీ నదీతీరంలో ఆశ్రమం నిర్మించుకుని నివసించారు. అలనాడు అత్రిమహర్షి భార్య అనసూయాదేవి సీతాదేవికి పాతివ్రత్య మహాత్మ్యాన్ని భోదించింది ఇక్కడే. శ్రీరాముడు తండ్రికి పిండప్రదానం చేసిన ఇక్కడి ప్రదేశం శ్రీరామఘాట్‌గా పిలువబడుతుంది.

ఈ ఘాట్‌కి పశ్చిమ దిక్కున బ్రహ్మయజ్ఞం చేసిన యజ్ఞవేదిక ఉన్నది. ఆ పక్కనే సీతారాములు నివసించిన పర్ణశాల. ఆ ప్రదేశంలో శ్రీసీతారాముల ఆలయం నిర్మించబడింది. శ్రీరామఘాట్‌లో స్నానం చేసిన తర్వాత ఆలయంలో శ్రీసీతారాములను భక్తులు దర్శించుకుంటారు. భోగభాగ్యాలకి అతీతంగా శ్రీసీతారాములు ఎంతో అన్యోన్యంగా పర్ణశాలలో నివసించిన ఈ ప్రదేశంలోని ఆలయంలోని మూర్తులకు భక్తితో పూజలు చేస్తే భార్యాభర్తల్లో లోపించిన అన్యోన్యత చేకూరుతుందని భక్తుల నమ్మకం.

## అర్జునుడికి గీతోపదేశం చేసిన ప్రదేశంలోని క్షేత్రం

కురుక్షేత్ర. ఇది ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ఢిల్లీ నుండి 150 కి.మీ దూరంలో ఉంది. ఈ పేరు రావటానికి కారణం పూర్వం కురువంశ మూలపురుషుడు 'కురువు' యజ్ఞం చేయటానికి ఈ క్షేత్రమును ఎంచుకున్నాడు. కురుక్షేత్ర యుద్ధం జరిగిన స్థలం. శ్రీకృష్ణ భగవానుడు రథసారథియై అర్జునుడికి గీతోపదేశం చేసిన స్థలం జ్యోతీశ్వర్‌గా ప్రసిద్ధిచెందింది. భీష్ముడు ఉత్తరాయణ పుణ్యకాలం వరకు అంపశయ్యపై ఉన్న ప్రదేశం మరియు శ్రీవిష్ణుసహస్రనామాన్ని భగవానుడు శ్రీకృష్ణుడి సన్నిధానంలో చెప్పిన ప్రదేశం. ఈ ప్రదేశంలోని భూమి అంతా ఎరుపురంగులో ఉంటుంది. ఎన్నో ఆలయాలు, జలాశయాలు, సరస్సులు ఉన్న ఈ ప్రదేశం 2500చ.మైళ్ళు విస్తరించి ఉంటుంది. ఈ ప్రాంతంలో ఉన్న వటవృక్షం కురువు యజ్ఞం చేసిన నాటి కాలం నుంచి ఇప్పటి వరకు అన్నింటికీ సాక్షీభూతంగా నిలిచి ఉంది.

## శ్రీమహాలక్ష్మి తన స్వామికి స్వయంగా నైవేద్యం చేసి సమర్పించే క్షేత్రం

బద్రీనాథ్ క్షేత్రం. ఉత్తరాంచల్‌లో ఉన్నది ఈ ఆలయం. ఘనచరితను కలిగిన వైష్ణవ క్షేత్రం. చారథామ్ యాత్రలోని క్షేత్రం. ఆలయంలో స్వామి బదరీనాథుని విగ్రహ నాభి వద్ద ఎరుపురంగులో ఉన్న మంచి గంధపు బొట్టు గుండ్రని ఆకారంతో ఉంటుంది.

తొడలపై చిన్న తిలకపు బొట్టు, వక్షస్థలములోని శ్రీవత్స మరియు భృగులతల చిహ్నాములను భక్తులు దర్శించవచ్చు. స్వామి వారి ముఖము వెయ్యి దివ్యమణులకన్నా అధికంగా ప్రభాసితమవుతుంటుంది. నరనారాయణులు శ్రీమహాలక్ష్మీదేవి యొక్క నివాసస్థలమైన రేగుచెట్టు క్రింద తపమాచరించిన దివ్యప్రదేశం. ఈ ఆలయంలో స్వామిని వైశాఖమాసము నుండి కార్తీకమాసం వరకు మానవులు పూజిస్తే మార్గశిరం నుండి చైత్రమాసం చివరి వరకు దేవతలు పూజిస్తారని శాస్త్ర పురాణం. అందువలననే ఆలయం

వైశాఖం నుండి కార్తీకం వరకు మాత్రమే తెరవబడి ఉంటుంది. తర్వాత ఆరునెలలు ఆలయాన్ని మూసివేస్తారు. ఆలయానికి దగ్గరలో ఉన్న తప్తకుండ్ అనే వేడినీటి కుండంలో భక్తులు స్నానమాచరించి స్వామిని దర్శించు కుంటారు.

ఆ తర్వాత ప్రక్కనే ఉన్న లక్ష్మీదేవాలయములోని అమ్మవారిని దర్శించుకుంటారు. స్వామివారికి లక్ష్మీదేవియే స్వయంగా తయారుచేసి ప్రసాదాన్ని సమర్పిస్తుంది. అందుకనే ఇక్కడి ప్రసాదాన్ని మహాప్రసాదంగా ప్రతి ఒక్కరూ స్వీకరిస్తారు. అందువలననే బదరీ ప్రసాదాన్ని తాము స్వీకరించటమే గాక భక్తులందరికీ పంచితేనే బదరీయాత్ర ఫలితం దక్కుతుందని పెద్దలు చెబుతారు.

## ఈ వన సందర్శన పుణ్యం తరతరాలకి అందుతుంది

అటువంటి పుణ్యాన్ని అందించే వనం లక్ష్మీ వనం. ఈ వనం బదరీనాథ్ నుండి 12 కి.మీ

దూరంలో ఉన్నది. అనేక భోజవృక్షాలు ఉన్న ఈ ప్రదేశంలోనే లక్ష్మీదేవి తపస్సు చేసుకుంటూ ఉండేదట. అందువలన ఈ వనాన్ని దర్శించుకుంటే ఆ పుణ్యం తరతరాలకీ అందుతుంది.

## సతీసావిత్రి గాథ జరిగిన పుణ్యక్షేత్రం...

## ఆరోగ్యాన్ని ప్రసాదించే దివ్యక్షేత్రం

పర్లిలోని వైద్యనాథేశ్వర ఆలయం. ఇది మహారాష్ట్రలోని భీడ్ జిల్లాలో ఉంది. ద్వాదశ జ్యోతిర్లింగాలలో ముఖ్యమైనది ఈ వైద్యనాథేశ్వర ఆలయం. ఆలయంలో సుమారు నాలుగు అడుగుల ఉన్న పానవట్టము దాని మధ్యలో రెండు అడుగుల ఎత్తులో ఉన్న శివలింగమూర్తి ఎంతో ఆకర్షణీయంగా ఉంటుంది. ఈ మూర్తి వెనుక మూడు అడుగుల గూడులో పార్వతీదేవి విగ్రహం ప్రతిష్ఠించబడి ఉంటుంది. గర్భగుడిలో దంపతులు ఇరువురూ ఉండటం ఇక్కడ విశేషం. అందువలననే పర్లీ ఆలయాన్ని అపూర్వకాశీ అని పిలుస్తారు.

మార్కండేయుడు యమపాశం నుంచి

తప్పించుకుని చిరంజీవి అయింది ఇక్కడే. ఇంకా సతీసావిత్రి కథ కూడా ఇక్కడే జరిగిందని చెప్తారు.

ఇక్కడి స్వామి అనారోగ్యాన్ని నయం చేసే వైద్యుడైన వైద్యనాథేశ్వరుడని భక్తుల విశ్వాసం. రావణాసురుడు కైలాసం నుంచి ఆత్మలింగాన్ని భూలోకానికి తీసుకురాగా వినాయకుడి కారణంగా ఆ లింగం ఇక్కడ పెట్టబడినపుడు శివుడు జ్యోతిర్లింగరూపుడై ఇక్కడ వెలిశాడు. ఇక్కడికి దగ్గరలోని వినాయక ఆలయంలో స్వామికి తొండం ఉండదు. వినాయకుడ్ని దర్శించుకున్న తర్వాతే వైద్యనాథేశ్వరుడ్ని దర్శించుకోవాలని పురాణ ఉవాచ.

## సాక్షాత్తు శ్రీమహావిష్ణువు పాదాలు గల క్షేత్రం

విష్ణుపాద ఆలయం. ఇది బీహార్ రాష్ట్రం గయా జిల్లాలో గయలో ఉన్నది. ఫల్గునీ, మధుర, స్వేదా నదులు కలిసే ప్రదేశంలో ఈ ఆలయం ఉంది. ఈ ఆలయం గర్భగుడిలో గదాధరుడైన శ్రీమహావిష్ణువు విగ్రహం ఉంటుంది. గర్భగుడికి ముందున్న ముఖమండపంలో వెండిరేకులతో

అలంకరించ బడిన పాదముద్రలు ఉంటాయి. ఇవి గయుని శిరస్సు మీద నిలబడి ఉన్న విష్ణుమూర్తి పాదముద్రలు. విష్ణుపాద ఆలయానికి ఎదురుగా నది అవతలి గట్టుమీద ఉన్న కొండ మీదున్న చిన్న మందిరంలో తన మామగారికి పిండప్రదానం చేసిన సీతమ్మవారి చేతులు దర్శనమిస్తాయి.

ఒకసారి అరణ్యావాసం చేస్తున్న సమయంలో తండ్రి తిథి రోజున అడవికి వెళ్ళిన శ్రీరాముడు సమయానికి వెనుతిరిగి రాకపోవటంతో సీతమ్మే స్వయంగా పిండప్రదానం చేసింది. ఆ విషయం శ్రీరాముడికి చెప్పగా శ్రీరాముడు నమ్మకపోవటంతో ఫల్గుణీనదీ, మర్రిచెట్లు సీతమ్మ పిండ ప్రదానం చెయ్యటం, ఆమె మామగారే స్వయంగా వచ్చి స్వీకరించటం తను కళ్ళారా చూసామని సాక్ష్యం చెబుతాయి. అందుకే సీతాదేవి ఆ మర్రిచెట్టుకి మరణం లేదనీ, ఫల్గునీ నది ఎండిపోదని వరం ఇస్తుంది. అదృశ్యంగా గమనించటం వల్ల ఫల్గునీ నదిలో ఒక నెల రోజుల మాత్రమే నీరు నిండుగా ఉండి, మిగిలిన రోజుల్లో నది అదృశ్యంగా పారు తుంది. పైకి మాత్రం ఇసుక కనిపిస్తుంటుంది.

## నైవేద్యాలను శ్రీమహాలక్ష్మీదేవియే స్వయంగా వచ్చి పర్యవేక్షించే క్షేత్రం

పూరీలోని జగన్నాథస్వామి ఆలయం. ఒడిశా రాష్ట్రంలోని పూరీ పట్టణంలో ఉంది. నీలాద్రి అనే పర్వతంపైన ఉన్నదీ జగన్నాథుని ఆలయం. ఆలయంలో జగన్నాథుడు, బలభద్రుడు, సుభద్రల విగ్రహాలు ఉంటాయి. ఇవి చెక్కతో చేయబడినవి. మూడేళ్ళకోసారి వచ్చే అధికమాసంలో నవకళేబరోత్సవం జరుగుతుంది. ఆ సమయంలో 'కొల్లివైకుంఠం' అనే స్థలంలో కొత్తగా తయారు చేయబడిన విగ్రహాలను ఆలయంలో ప్రతిష్ఠించి ఆ స్థలంలోని పాత విగ్రహాలను సమాధి చేస్తారు. హిందువులకి మాత్రమే ప్రవేశం ఉంటుంది. నిత్యం వందరకాల వంటకాలను తయారు చేసి స్వామివారికి నివేదిస్తారు. స్వయంగా మహాలక్ష్మీదేవి వచ్చి ఇక్కడ తయారు చేసే ప్రసాదాలను పర్యవేక్షిస్తుందని భక్తులు నమ్ముతారు. రథయాత్ర కోసం ప్రతి సంవత్సరం జగన్నాథునికీ, బలభద్రునకు, సుభద్రకు కొత్త రథాలను చేయిస్తారు. ఈ రథయాత్ర

ప్రపంచప్రసిద్ధి చెందినది. ప్రతి భారతీయుడు ప్రత్యక్షంగా చూడవల్సిన రథయాత్ర పూరీ జగన్నాథ రథయాత్ర.

## యక్షప్రశ్నలకు ధర్మరాజు సమాధానాలు చెప్పిన ప్రదేశం

బరద్వాన్‌లోని ధర్మరాజు ఆలయం. ధర్మరాజు ధర్మ నిరతిని పరీక్షించదలచాడు యమధర్మరాజు. నీటికోసం కొలను వద్దకు వచ్చిన ధర్మరాజు నలుగురు తమ్ముళ్ళనీ హతమార్చగా ధర్మరాజే అక్కడికి వచ్చినపుడు యక్షుని రూపంలో యముడు వేసిన యక్షప్రశ్నలకి ధర్మరాజు సమాధానమిచ్చి ఆయనని సంతృప్తి పరిచాడు. అప్పుడు యమధర్మరాజు 'నీ సమాధానాలు నన్ను తృప్తి పరిచాయి గనుక నీ తమ్ములలో ఒకరిని బ్రతికిస్తాను.. ఎవరు కావాలో కోరకో'మనగా ధర్మరాజు నకులుడిని బ్రతికించమన్నాడు. నకులుడే ఎందుకు అని అడగగా కుంతీపుత్రులలో జ్యేష్ఠుడను నేను బ్రతికి ఉన్నాను.

మాద్రి పుత్రులలో జ్యేష్ఠుడు నకులుడు కనుక అతనిని బ్రతికించమన్నానని' యమధర్మరాజుతో

చెప్పగా ఆయన ధర్మరాజు ధర్మనిరతికి సంతసించి నలుగురు తమ్ముళ్ళనీ బ్రతికించాడు. వారు ధర్మానికే మారుపేరైన ధర్మరాజుకి ఇక్కడ ఆలయం నిర్మింపచేశారు. అదే ఈ ఆలయం. ఈ ఆలయంలో ధర్మరాజు తాబేలు రూపంలో దర్శనమిస్తాడు.

## శ్రీమహాలక్ష్మి చేతిలో శివలింగం ఉన్న క్షేత్రం

బండోరాలోని శ్రీమహాలక్ష్మి ఆలయం. గోవా రాష్ట్రంలోని పోండా నుండి నాలుగు కి.మీ దూరంలో ఉన్నది. శ్రీ మహాభారతం కాలంలో గోమంపర్వతప్రాంతమే ఇప్పుడు గోవాగా పిలవబడుతుంది. ఈ ప్రాంతంలో మహాశివునికి అంకితమైన నాగూషీ ఆలయం ఉంది. ఈ ఆలయానికి దగ్గరలో శ్రీమహాలక్ష్మి ఆలయం భక్తులను విశేషంగా ఆకర్షిస్తుంది. కారణం గుర్భగుడిలో దర్శనమిస్తున్న అమ్మవారి అరచేతిలో శివలింగం ఉండటమే. ఇరవైనాలుగు శక్తి పీఠాలలో ఒకటి అని కాళికాపురాణం ప్రకారం చెబుతారు.

# శ్రీదేవీ స్థానాలు

"తల్లీ, అతిరహస్యమైన భక్తి యోగం గూర్చీ, ధ్యానయోగం గూర్చీ వివరించావు. నీ స్థానాల గూర్చి చెప్పి మమ్మల్ని చరితార్థులని చేయుము."

"లక్ష్మి నివాసము కొల్హాపూర్. అలాగే రేణుకా నివాసము మాతృపురమూ, హింగుళాదేవి నివాసం తుళజాపురమూ, జ్వాలాముఖి నివాసం సప్తశృంగమూ, అలాగే శాకంభరీ, భ్రామరీ, రక్తదంతికా దుర్గాదేవి స్థానాలు. ఇక వింధ్యాచల నివాసినీ స్థానమూ, గుహకాళి నివాసస్థామైన నేపాలూ, నీలాంబాదేవి నివాసస్థానమైన నీలాచలమూ, జాంబూనదేశ్వరీ స్థానమైన శ్రీనగరమూ, చిదంబరమున మీనాక్షీ స్థానమూ మరియు భీమాదేవీ, విమలా, శ్రీచంద్రలా, కౌశికా నివాసాలూ, వేదారణ్యము సుందరీ స్థానము, వైద్యనాథంలోని భగళాస్థానమూ, మణిద్వీపంలో భువనేశ్వరి, త్రిపుర భైరవీ స్థానమైన కామాఖ్య క్షేత్రం, కాశీ విశాలాక్షి ఇవి నా ముఖ్య స్థానాలు.

నాకు ఇష్టమైన వ్రతాలు... అనంతతృతీయా వ్రతము, శుక్రవార వ్రతము, భానువార వ్రతము,

ప్రదోష వ్రతము, రసకళ్యాణీ వ్రతము మరియు ఆర్ద్రానందకర వ్రతములు.

-శుభమస్తు-